# సుమతి వేమన శతకాలు

సంస్కృతానువాదము

శ్రీ యస్. టి. జి. వరదాచార్యులుగారు ఎం. ఏ.




చు ర ణ :

సాహిత్య అకాడమి

తిలక్ రోడ్, హైదరాబాదు.

అవిదితాహ్వయకేన మనీషిణా
కృతిరియం కృతినాంధ్రగిరీరితా।
తదనువాదమిమం శతకాత్మకం
సహృదయాః శృణుతాదరణోచితమ్॥

శ్రీరస్తు

దేశభాషలందు తెలుఁగు లెస్స

# సుమతి శతకము

(తెలుఁగు మూలము)

1. శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకల జనులు నౌరాయనఁగా
ధారాళమైన నీతులు
నోరూరఁగఁ జవులుపుట్ట నుడివెద సుమతీ!

2. అక్కఱకు రాని చుట్టము
మ్రొక్కిన వరమీని వేల్పు మోహరమునఁ దా
నెక్కిన బారని గుర్రము
గ్రక్కున విడువంగవలయుఁ గదరా సుమతీ!

3. అడిగిన జీతం బియ్యని
మిడిమేలపు దొరను గొల్చి మిడుకుట కంటెన్
వడిగల యెద్దులఁ గట్టుక
మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ!

4. అడియాసఁ గొలువుఁ గొలువకు
గుడిమణియము సేయఁబోకు కుజనులతోడన్
విడువక కూరిమి సేయకు
మడవినిఁ దోడరయకొంటి నరుగకు సుమతీ!

శ్రీః

వాణీం భజత గైర్వాణీమ్॥

# సుమతిశతకమ్

( ఆంధ్ర్యా అనువాదః )

1. శ్రీరామస్య దయాహేతోః సాధుసాధ్వితి సాధుషు।
వదత్సు హారిణః పథ్యాన్ బ్రవీమి సుమతే నయాన్॥

2. ఆపద్యసాహ్యకృద్బంధుః వరాదాయీ సురోఽర్చితః
యుద్ధ్యాయాధోఽచలస్స్వశ్వః త్యక్తవ్యాసుమతే ద్రుతమ్॥

3. అపి జీవేత్ సుఖం క్షేత్రం కృషన్ జవయుతైర్వృషైః।
నద్వార్ధిశమదాకారం సుమతే స్వామినం భజన్॥

4. మా కార్షీః సేవనం లుబ్ధః ప్రణయం కుజనైః సమం
దేవాలయాధికారం చ సంచారం సుమతే వనే॥

5. అధరము గదలియుఁ గదలక
మధురములగు భాషలుడిగి మౌనవ్రతుఁడౌ
నధికార రోగపూరిత
బధిరాంధకశవముఁ జూడఁ బాపము సుమతీ!

6. అప్పుఁగొని సేయు విభవము
ముప్పునఁ బ్రాయంపుటాలు మూర్ఖునితపమున్
దప్పరయని నృపు రాజ్యము
దెప్పరమై మీఁదఁ గీఁడుఁదెచ్చుర సుమతీ!

7. అప్పిచ్చువాఁడు వైద్యుఁడు
నెప్పుడు నెడతెగక పాఱునేఱును ద్విజుఁడున్
జొప్పడిన యూర నుండుము
చొప్పడకున్నట్టి యూరుఁ జొరకుము సుమతీ!

8. అల్లుని మంచితనంబును
గొల్లని సాహిత్యవిద్య కోమలినిజమున్
బొల్లున దంచిన బియ్యముఁ
దెల్లని కాకులును లేవు దెలియర సుమతీ!

5. విరళస్ఫురితోష్ఠో యో మధురాలాపవర్జితః।
అధికారగదగ్రస్తః స మూకః సుమతే శవః॥

6. ఋణాద్భోగస్తపోజ్ఞస్య వృద్ధస్యతరుణీప్రియా,
అవివేకిప్రభో రాజ్యం సుమతేఽనర్థహేతవః॥

7. ఋణదాతాఽగదఙ్కారో నదీ నిత్యజలా ద్విజః।
యత్ర తస్మిన్ వస గ్రామే నో చేత్తం సుమతే త్యజ॥

8. జామాతుః సౌమ్యతా గోపపాణ్డితీ సత్యతా స్త్రియః
తుషాత స్తణ్డులాః శ్వేతాః కాకాస్స్యుస్సుమతే న హి॥

౯. ఆఁకొన్నఁ గూడె యమృతము
తాఁకొందక నిచ్చువాఁడె దాత ధరిత్రిన్
సోఁకోర్చువాఁడె మనుజుఁడు
తేఁకువ గలవాఁడె వంశతిలకుఁడు సుమతీ!

10. ఆకలి యుడుగని కడుపును
వేఁకటియగు లంజపడుపు విడువని బ్రతుకున్
బ్రాఁకొన్న నూతి యుదకము
మేఁకల పాడియును రోఁతమేదిని సుమతీ!

11. ఇచ్చునదె విద్య రణమునఁ
జొచ్చునదే మగతనంబు సుకవీశ్వరులన్
మెచ్చునదె నేర్పు వాదుకు
వచ్చునదే కీడుసుమ్ము వసుధను సుమతీ!

12. ఇమ్ముగ జదువని నోరును
నమ్మా యని పిలచి యన్నమడుగని నోరున్
దమ్ములఁ బిలువని నోరును
గుమ్మరి మను ద్రవ్వినట్టి గుంటర సుమతీ!

9. నిష్కళంకం దదద్దాలా ఋషుక్షీరోదసన్నిధా।
ధైర్యవాన్ వంశతిలకః సుమతే క్లేశధృత్ పుమాన్॥

10. ఋషుజ్ఞానపసుస్ఫూర్తిః కులటాత్వోపజీవనమ్।
జీర్ణకూపాఃబిం గర్భ్యమహీనాం సుమతే పయః॥

11. ఫలప్రదాత్రీ విద్యా హి రణోత్సాహో హి పౌరుషమ్।
కావ్యాస్వాదో హి వైదగ్ధ్యం వాచితా సుమతే వృథా॥

12. యన్ముఖం న పఠేత్ సమ్యగ్ గమ్యేత్యన్నం న యాచతే।
నానుజాంశ్చాహ్వయేత్తద్ధి ఖాతమృత్సుమతే బిలమ్॥

13. ఉడుముండదె నూఱేండ్లును
బడియుండదె పేర్మిఁ బాము పదినూఱేండ్లున్
మడువునఁ గొక్కెరయుండదె
కడు నిలఁ బురుషార్థపరుఁడు గావలె సుమతీ!

14. ఉత్తమగుణములు నీచున
కెత్తెఱఁగునఁగలుగనేర్చు నెయ్యెడలం దా
నెత్తిచ్చి కరఁగి పోసిన
నిత్తడి బంగారమగునె యిలలో సుమతీ!

15. ఉదకముఁ ద్రావెడు హయమును
మదమున నుప్పొంగుచుండు మత్తేభంబున్
మొదవుకడ నున్న వృషభముఁ
జదువని యావిప్రు కడకుఁ జనకుర సుమతీ!

16. ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడె నేర్పరి సుమతీ!

13. గోధా కిం న శతాయుః స్యాత్ సహస్రాబ్దిశ్చ పన్నగః
హ్రదే సుఖీ బకశ్చాపి పుమర్థాన్ సుమతే భజ॥

14 న ప్రాప్యన్తే గుణా నీచైరుత్తమస్య కథంచన।
పిత్తలం కిం భవేత్స్వర్ణం సుమతే యత్నవిద్రుతమ్॥

15. అశ్వ మంభః పిబన్తం చ మత్తేభం చ మదస్రుతమ్।
గోః సమీపే వృషం మాభ్యే హ్యావిద్యం సుమతేఽధమమ్॥

16. ఉపకర్తారముద్దిశ్య నోపకారేఽస్త్యపూర్వతా।
ఉపకర్తాపకర్తుస్తు సుమతే సుజనో మతః॥

17. ఉపమింప మొదలుతియ్యన
కపటం బెడనెడను జెఱకు కైవడినేపో
నెపములు వెదకును గడపటఁ
గపటపు దుర్జాతి పొందు గదరా సుమతీ!

18. ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కా మాటలాడి యన్యులమనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ!

19. ఎప్పుడుఁ దప్పులు వెదకెడు
సప్పురుషుని గొల్వఁగూడదది యెట్లన్నన్
సర్పంబు పడగనీడను
గప్ప వసించినవిధంబు గదరా సుమతీ!

20. ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లన్నన్
దెప్పలుగఁ జెఱువు నిండినఁ
గప్పలు పదివేలుచేరుఁ గదరా సుమతీ!

17. కపటం మధురం పూర్వమిక్షువద్దృశ్యతే జనైః।
పౌరోభాగ్యాన్నిజం రూపం వ్యనక్తి సుమతేఽన్తతః॥

18. యదా యదుచితం వాక్యం వక్తి వోక్త్వా పరాన్నయః।
శ్లాఘ్నాతి శ్లాఘ్యతే వాపి స్వయం స సుమతే కృతీ॥

19. రంధ్రాన్వేషపరం నిత్యం నోపసర్పేత్ కదాచన।
భేకః ఫణిఫణాచ్ఛాయాం శ్రయతే సుమతే కిము॥

20. ఆయాన్తి సహ సంపద్భిః బాన్ధవా బహులా భువి।
జలపూర్ణే సహస్రాణి భేకాస్స్యుః సుమతే హ్రదే॥

17. ఉపమింప మొదలు తియ్యన
కపటం బెడనెడను జెఱకు కైవడినేపో
నెపములు వెదకును గడపటఁ
గపటపు దుర్జాతి పొందు గదరా సుమతీ!

18. ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కా మాటలాడి యన్యులమనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ!

19. ఎప్పుడుఁ దప్పులు వెదకెడు
నప్పురుషుని గొల్వఁగూడదది యెట్లన్నన్
సర్పంబు పడగనీడను
గప్ప వసించినవిధంబు గదరా సుమతీ!

20. ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లన్నన్
దెప్పలుగఁ జెఱువు నిండినఁ
గప్పలు పదివేలుచేరుఁ గదరా సుమతీ!

17. కపటం మధురం పూర్వమిక్షువద్భక్ష్యతే జనైః।
పౌరోభాగ్యాన్నిజం రూపం వ్యనక్తి సుమతేఽన్తతః॥

18. యదా యదుచితం వాక్యం తత్తదోక్త్వా పరాన్నయః।
క్లిశ్నాతి క్లిశ్యతే వాపి స్వయం న సుమతే కృతీ॥

19. రంధ్రాన్వేషపరం నిత్యం నోపసర్పేత్ కదాచన।
భేకః ఫణిఫణాచ్ఛాయాం శ్రయతే సుమతే కిము॥

20. ఆయాన్తి సహ సంపద్భిః బాన్ధవా బహులా భువి।
జలపూర్ణే సహస్రాణి భేకాస్స్యుః సుమతే హ్రదే॥

21. ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల దోషము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువులాజ్ఞ మేదిని సుమతీ!

22. ఒక యూరికి నొక కరణము
నొక తీర్పరియైనఁగాక నొగిఁ దఱుచైనన్
గకవికలు గాకయుండునె
సకలంబును గొట్టువడక సహజము సుమతీ!

23. ఒల్లనిసతి నొల్లనిపతి
నొల్లని చెలికాని విడువనొల్లనివాఁడే
గొల్లండుగాక ధరలో
గొల్లండును గొల్లఁడౌనె గుణమున సుమతీ!

24. ఓడల బండ్లును వచ్చును
ఓడలు నాబండ్లమీఁద నొప్పుగ వచ్చున్
ఓడలు బండ్లును వలెనే
వాడంబడుఁ గలిమిలేమి వసుధను సుమతీ!

21. జంఘనిందా న కర్తవ్యా నాపక్వఫలసంచయః।
పలాయనం తథా యుద్ధే ధిక్కారః సుమతే గురోః॥

22 ఏకోఽధికారీ నిర్ణేతా హ్యేకో గ్రామే భవేద్యది।
శుభం తత్ర పదం ధత్తేఽనర్థస్తు సుమతేఽన్యథా॥

23. నారాగిణో జిహాస్యంతే జాయాస్వామిసుహృజ్జనాః।
యేన గోపః స ఏవ స్యాత్ జాత్యా స సుమతే న సః॥

24. ఉహ్యతే శకటో నావా శకటేన తథా చ నౌః।
తయోరివ నృణాం స్యాతాం సుమతే హ్యుచ్చనీచతే॥

25. కసు బలవంతుండైనను
బుడమినిఁ బ్రాయంపుటాలిఁ బుట్టిన యింటం
బడవుంద నిచ్చెనేనియుఁ
బసుపుగ సంగటికిఁ దానె పంపుఁ సుమతీ!

26. కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండఁబెట్టి శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టముఁ గట్టిన
వెనుకటి గుణమేల మాను వినురా సుమతీ!

27. కప్పకు నొరగాలైనను
సర్పమునకు రోగమైన సతి తులువైనన్
ముప్పున దరిద్రుడైనను
దప్పదు మఱి దుఃఖమగుట తథ్యము సుమతీ!

28. కమలములు నీటఁ బాసినఁ
గమలాప్తుని రశ్మిసోఁకి కమలినభంగిన్
దమతమ నెలవులఁ దప్పినఁ
దమమిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ!

25. యోఽఙ్గీకరోతి యువతేః చిరం జ్ఞాతికృతే స్థితిమ్।
ప్రేషయత్యాపణం వృత్త్యై జారిణ్యాః సుమతే స తామ్॥

26. ఉపలస్నోఽపి పిత్రోఽపి హేమసింహాసనే వరే।
వసతః కిం విజహ్యాత్ స్వం సుమతే పూర్వవర్తనమ్॥

27. మండూకస్యైకపాదత్వం రోగః సర్పస్య వార్ధకే।
దారిద్ర్యం కులటా భార్యా సుమతే దుఃఖహేతవః॥

28. జలజం సలిలాద్భ్రష్టం మ్లానంస్యాన్మిత్రరశ్మిభిః
స్థానచ్యుతస్య మిత్రాణి భవన్తి సుమతేఽరయః॥

29. కరణము కరణము నమ్మిన
మరణాంతక మౌనుగాని మనలేఁడు సుమీ
కరణము తనసరి కరణము
మరి నమ్మక మర్మమిడక మనవలె సుమతీ!

30. కరణముల ననుసరింపక
విరసంబునఁ దిన్నతిండి వికటించుఁ జుమీ
యిరుసునఁ గందెనఁ బెట్టక
పరమేశుని బండియైనఁ బారదు సుమతీ!

31. కరణము సాధై యున్నను
గరి మదముడిగినను బాము కఱవక యున్నన్
ధరఁ దేలు మీఁటకున్నను
గర మరుదుగ లెక్కఁగొనరు గదరా సుమతీ!

32. కసుగాయఁ గఱచి చూచిన
మసలకఁ దనయొగరుగాక మధురంబగునా
పస గలుగు యువతు లుండఁగఁ
బసిబాలలఁ బొందువాఁడు పశువుర సుమతీ!

29. దరిద్రో మరణం గచ్ఛేద్బుభుక్షా కరణాన్తరమ్।
ఉపోషితః సజాతీయం ప్రతీయాత్ సుమతే న సః॥

30. దరిద్రేణ సమం వైరాత్ దీర్ఘాద్భ్రష్టం న భాషితమ్।
ప్రహ్రాదోఽప్యసురాత్పుత్రో న భావేత్సుమతే రతః॥

31. కరణః సుజనో, హస్తీ మదహీనోఽదశస్త్వహిః
వృశ్చికోఽక్షతికారీ చ న గణ్యాః సుమతే భువి॥

32. అపక్వం స్యాత్ఫలం దష్టం కషాయం మధురం న తు।
సతీషు తరుణీష్వేవస్సన్న ప్రౌఢాః సుమతే పశుః॥

33. కవిగానివాని వ్రాఁతయు
నవరసభావములులేని నాతుల వలపున్
దవిలిచనుపందిసేయని
వివిధాయుధ కౌశలంబు వృథరా సుమతీ!

34. కాదుసుమీ దుస్సంగతి
పోదుసుమీ కీర్తికాంత పొందిన పిదపన్
వాదుసుమీ యప్పిచ్చుట
లేదుసుమీ సతులవలపు లేశము సుమతీ!

35. కాముకుఁడు తనిసి విడిచిన
కోమలిఁ బరవిటుఁడు గవయఁ గోరుటయెల్లన్
బ్రేమమునఁ జెఱకు పిప్పికిఁ
జీమలు వెసమూఁగినట్లు సిద్ధము సుమతీ!

36. కారణములేని నగవును
బేరణములు లేనిలేమ పృథివీస్థలిలోఁ
బూరణము లేని బూరెయు
వీరణములు లేని పెండ్లి వృథరా సుమతీ!

33. అకపే రచనా, స్త్రీణాం రక్తిర్వ్యాపవిమోహితా।
శఠో ధావతి కోలే చాప్యసిద్ధః సుమతే వృథా॥

34. న స్నేహో దుర్జనైః సార్ధం న నాశః కీర్తిసంపదః।
న శ్లాఘ్యత్వమృణం దాతుః న రాగః సుమతే ప్రియః॥

35. అస్యభుక్తాం స్త్రియం భోక్తుమిచ్ఛన్నస్యావటః సమః
పిపీలైరుపగచ్ఛద్భిః పిష్టేక్షుం సుమతే రసాత్॥

36. హాసో నిర్హేతుకో వ్యర్థో యోషా చాధృతకంచుకా।
పూరణేన వినా పూపోఽప్యతౌర్యః సుమతే మహాః॥

37. సంకాంతలోడ నెప్పుడుఁ
గలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
యలకంఠకంఠి కన్నీ
రొలికెన సిరియింటనుండ నొల్లదు సుమతీ!

38. కూరిమి కలదినములలో
నేరములెన్నఁడును గలుగనేరవు మఱి యా
కూరిమి విరసంబైనను
నేరములే తోఁచుచుండు నిక్కము సుమతీ!

39. కొంచెపునరు సంగతిచే
నంచితముగఁ గీడువచ్చు నది యెట్లన్నన్
గించిత్తు నల్లి కుట్టిన
మంచమునకుఁ దిట్లువచ్చు మహిలో సుమతీ!

40. కొక్కోకమెల్లఁ జదివినఁ
జక్కనివాఁడైన రాజచంద్రుండైనన్
మిక్కిలి రొక్కము లియ్యకఁ
జిక్కదురా వారకాంత సిద్ధము సుమతీ!

37. మలస్త్రీషు న వైరం స్యాత్ న తాసామపవాదనమ్।
స్త్రియోఽత్ర పతితం గేహే ధారయేత్ సుమతే క్రమమ్॥

38. జాతే స్నేహమయే దోషో గుణకక్షాం విగాహతే।
విపరీతే గుణస్యాపి దోషతా సుమతే భవేత్॥

39. ధ్రువం నీచనరస్నేహా దనర్థః ప్రభవేద్భువి।
మఞ్చో మత్కుణదంశాద్ధి నింద్యతాం సుమతే వ్రజేత్॥

40. కామశాస్త్రవినిష్ణాతో రాజేన్దుః సున్దరోఽపి సన్।
పణ్యాఙ్గనాం వినా పణ్యం లభతే సుమతే కథమ్॥

41. కొఱగాని కొడుకు పుట్టిన
గొఱగామియెకాదు తండ్రి గుణములఁ జెఱచున్
జెఱకుతుద వెన్ను పుట్టిన
జెఱకునఁ దీపెల్లఁ జెఱచు సిద్ధము సుమతీ!

42. కోమలి విశ్వాసంబును
బాములతోఁ జెలిమి యన్యభామలవలపున్
వేముల తియ్యఁదనంబును
భూమీశుల నమ్మికలును బొంకుర సుమతీ!

43. గడనగల మగనిఁ జూచిన
నడుగులకును మడుఁగులిడుదు రతివలు తమలో
గడనుడుగు మగనిఁ జూచిన
నడపీనుఁగు వచ్చెననుచు నగుదురు సుమతీ!

44. చింతింపకు గడచినపని
కింతులు వలతురని నమ్మకెంతయు మదిలో
సంతఃపుర కాంతలతో
మంతనములు మానుమదియె మతముర సుమతీ!

41. సంజాతస్తనయో వృద్ధః సర్వాన్ హన్తి గుణోద్గుణాన్।
మాధుర్యం మంజరీపేశోః సకలం సుమతే భ్రుణః॥

42. స్త్రీవిశ్వాసః పతిస్నేహాశ్చాస్యకాన్తానురక్తతా।
ఊఢ్వా నిమ్నస్య మాధుర్యం నృపాణాం సుమతే పదః॥

43. అర్జితారం పతిం యోషా మానయత్యుపచారతః।
మన్యతే తు దరిద్రం తం జంగమం సుమతే శవమ్॥

44. మానుశోచీ రతీతం త్వం మా శ్రద్ధాః కామినీరతిమ్।
మావరోధజనైర్గుప్తం భాషణం సుమతే కృథాః॥

45. చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైనయట్లు పామరుఁడు దగన్
హేమంబుఁ గూడఁబెట్టిన
భూమీశుల పాలఁజేరు భువిలో సుమతీ!

46. చుట్టములు గానివారలు
చుట్టములము నీకటంచు సొంపుదలిర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబు గలుగఁ గదరా సుమతీ!

47. చేతులకుఁ దొడవు దానము
భూతలనాథులకుఁ దొడవు బొంకమి ధరలో
నీతియె తొడవెవ్వారికి
నాతికి మానంబు తొడవు నయముగ సుమతీ!

48. తడవోర్వక యొడ లోర్వక
కడువేగం బడిచిపడినఁ గార్యంబగునే
తడవోర్చిన నొడలోర్చినఁ
జెడిపోయిన కార్యమెల్లఁ జేకురు సుమతీ!

15 పిపీలనిర్మితా యాంతి వల్మీకాః ఫణినాం వశమ్।
ఛాత్రైస్స్వశిష్టైః కిం చిత్రం సుమతే స్వపసాప్నువేత్॥

16 అదత్తం ధనినం బంధుం త్యజంత్యర్థినః సదా ఇహ।
అధనో౽బద్ధుపద్భుష్ణుః స్తూయతే సుమతే సదైః॥

17 హస్తయోర్భూషణం దానం భూభృతాం సత్యభాషణమ్।
పాతివ్రత్యం తథా స్త్రీణాం సర్వేషాం సుమతే నయః॥

18. కాలాత్యయతనూతాపాసహిష్ణోః న ఫలోదయః।
సోఢక్లేశవిలంబేన సుమతే నష్టమాప్యతే॥

49. తనకోపమె తనశత్రువు
తన శాంతమె తనకురక్ష దయచుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!

50. తనయూరి తపసితనమును
దనపుత్రుని విద్య పెంపుఁ దనసతిరూపున్
దన పెరటిచెట్టు మందును
మనమున వర్ణింపరెట్టి మనుజులు సుమతీ!

51. తన కలిమి యింద్రభోగము
తన లేమియె సర్వలోక దారిద్ర్యంబుఁ
దనచావు జగత్ప్రళయము
తనువలచిన యదియె రంభ తథ్యము సుమతీ!

52. తనవారు లేనిచోటను
జనవించుక లేనిచోట జగడముచోటన్
అనుమాన మైనచోటను
మనుజునకును నిలువఁదగదు మహిలో సుమతీ!

49. కోప ఏవ స్వకీయోఽరిః, శాన్తి రక్షా, సఖా దయా।
బన్ధుః, తుష్టిర్భవేత్స్వర్గో నిర్దయస్సుమతే వ్యథా॥

50. తపస్స్వీయం సతీపాపం వైద్యమన్త్రం దేవయన్త్రం చ।
ఓషధిః ప్రాజ్ఞగణస్థా చ, న స్తుత్యాః సుమతే జనైః॥

51. స్వసంపన్మధువచ్ఛోగః స్వదుఃఖం స్వదరిద్రతా।
స్వమృత్యుర్జగతామంతః స్వప్రియా సుమతేఽప్సరాః

52. దేశే విరహితే స్వామిః నిస్స్నేహే కలహాకులే।
సంశయస్యాస్పదే వాసి న స్థేయం సుమతే జనైః॥

53. తమలము వేయని నోరును
రమణుల చనుమొనలమీద రాయనిమేనున్
గమలములు లేనికొలఁకును
హిమధాముఁడు లేనిరాత్రి హీనము సుమతీ!

54. తలనుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁకనుండు వృశ్చికమునకున్
దలతోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!

55. తలపొడుగు ధనముఁ బోసిన
వెలయాలికి నిజము లేదు వివరింపంగా
దలఁదడివి బాస జేసిన
వెలయాలిని నమ్మరాదు వినరా సుమతీ!

56. తలమాసిన నొలుమాసిన
వలువలు మాసినను బ్రాణవల్లభునైనన్
గులకాంతలైన రోతురు
తిలకింపఁగ భూమిలోనఁ దిరముగ సుమతీ!

53. అతామ్బూలం ముఖం గాత్రమపుష్పధరణీస్తనమ్।
పద్మహీనో హ్రదో రాత్రిః నిశ్చన్ద్రా సుమతే వృథా॥

54. విషం స్యాత్ఫణినో మూర్ధ్ని పుచ్ఛాగ్రే వృశ్చికస్య చ।
ఆచూడపాదం సర్వత్ర ఖలస్య సుమతే విషమ్॥

55. దత్తేఽప్యర్ఘే శిరోదఘ్నే గణికాయా న సత్యతా।
శిరసా శపమానాం తాం ప్రతీయాత్ సుమతే న హి॥

56. అకృత్తకేశం చాస్నాతం మలోపహతవాససమ్।
అపి ప్రియం జుగుప్సన్తే సుమతేఽపి కులాఙ్గనాః॥

57. తాననుభవింపనర్థము
మానవపతిఁ జేరుఁగొంత మఱి భూగతమౌఁ
గానల నీఁగలు కూర్చిన
తేనియ యొరుఁ జేరునట్లు తిరముగ సుమతీ!

58. దగ్గరఁ గొండెము చెప్పెడు
ప్రెగ్గడ పలుకులకు రాజు ప్రియుఁడై మఱి తా
నెగ్గు ప్రజ కాచరించుట
బొగ్గులకై కల్పతరువుఁ బొడుచుట సుమతీ!

59. ధనపతిసఖుఁడై యుండియు
నెనయంగా శివుఁడు భిక్షమెత్తఁగవలసెన్
దనవారి కెంత గలిగినఁ
దనభాగ్యమె తనకుఁగాక తథ్యము సుమతీ!

60. ధీరులకుఁ జేయుమేలది
సారంబగు నారికేళసలిలము భంగిన్
గారవమును మఱి మీదట
భూరిసుఖావహము నగును భువిలో సుమతీ!

౫౭. అత్మ్రనాసుపదుక్తోఽర్ధో ఘూపతిం చ ఘువం వ్రజేత్।
మక్షికాసంచితం హేృతి సుమతేఽస్వాపకం మధు॥

౫౮. నృపః కర్ణేజపామాత్యవాగ్భిర్యో బాధతే ప్రజాః।
స విధక్షతి కల్ప్రద్రుం సుమతే క్షారకారణాత్॥

౫౯. ధనదేఽపి సుహృద్వర్యే భైక్షచర్యైవ ధూర్జటేః
స్వీయానాం విభవేఽనల్పే స్వభాగ్యం సుమతే స్వకమ్॥

౬౦. కరోత్యుపకృతో ధీరః శతావృత్తం ప్రతిప్రియమ్।
దత్తే క్షారాంబుసంసిక్తో లాఙ్గలీ సుమతే సుధామ్॥

61\. నడువకుమీ తెరువొక్కటఁ
గుడువకుమీ శత్రునింటఁ గూరిమితోడన్
ముడువకుమీ పరధనముల
నుడువకుమీ యొరులమనసు నొవ్వగ సుమతీ!

62\. నమ్మకు సుంకరి జూదరి
నమ్మకు మగసాలివాని నటువెలయాలిన్
నమ్మకు మంగడి వానిని
నమ్మకుమీ వామహస్తు నవనిని సుమతీ!

63\. నయమునఁ బాలును ద్రావరు
భయమునను విషమ్మునైన భక్షింతురుగా
నయమెంత దోషకారియొ
భయమే చూపంగవలయు బాగుగ సుమతీ!

64\. నవరస భావాలంకృత
కవితాగోష్ఠియును మధురగానంబును దా
సవివేకి కెంత జెప్పిన
జెవిటికి సంకూదినట్లు సిద్ధము సుమతీ!

61. న పన్థానం వ్రజేదేకో నాద్యాచ్ఛత్రుగృహే రసాత్।
నాదదీత పరస్వం చ నాప్రియం సుమతే వదేత్॥

62 కరగ్రాహో ద్యూతకరః స్వర్ణకారః పణాఙ్గనా।
వామహస్తః పణాజీవః శ్రద్ధేయాః సుమతే న హి॥

63. న పాయయేత్పయః సామ్నా విషం దండాత్తు భోజయేత్
దుర్బలం సామ దండస్తు ప్రబలః సుమతే ధ్రువమ్॥

64. రసవత్కవితాగోష్ఠీ శ్రావ్యగానం చ సన్నిధౌ।
అజ్ఞస్య బధిరస్యేవ సుమతే శంఖనాదనమ్॥

65\. నవ్వకుమీ సభలోపల
నవ్వకుమీ తల్లిదండ్రి నరనాథులతోన్
నవ్వకుమీ పరసతితో
నవ్వకుమీ విప్రవరుల నయమిది సుమతీ!

66\. నీరే ప్రాణాధారము
నోరే రసభరితమైన నుడువుల కెల్లన్
నారే నరులకు రత్నము
చీరే శృంగారమండ్రు సిద్ధము సుమతీ!

67\. పగవల దెవ్వరితోడను
వగవంగా వలదు లేమివచ్చినపిదపన్
దెగనాడవలదు సభలను
మగువకు మనసీయవలదు మహిలో సుమతీ!

68\. పతికడకుఁ దన్నుఁ గూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల
మతిమంతులు చనరు నీతిమార్గము సుమతీ!

65. సభాయాం న హసేత్పుత్రో: సన్నిధౌ చ మహీక్షితః
పరసత్యాం న హాసః స్యాత్ న హసేత్ సుమతే ద్విజమ్॥

66 జీవితస్య జలం మూలం ముఖం చ రసవద్గిరామ్।
నారీ భూషా నరాణాం చ నారీణాం సుమతేఽమ్బరమ్॥

67. న కేనాపి భవేద్వైరం నానుశోచేద్దరిద్రతామ్।
న గోష్ఠ్యాం పరుషం భాష్యం స్త్రీలౌల్యం సుమతే త్యజ॥

68. రిక్తహస్తేన నోపేయాద్దైవతం భూపతిం గురుమ్।
ప్రేయసీం తనయం ధీమాన్ అవేప్సుః సుమతే శుభమ్॥

69. పనిచేయు నెడల దాసియు
ననుభవమున రంభ మంత్రి యాలోచనలన్
దనభుక్తియెడలఁ దల్లియు
ననఁ దన కులకాంతయుండ నగురా సుమతీ!

70. పరనారి సోదరుఁడై
పరధనముల కాసపడక పరులకు హితుఁడై
పరులు దను బొగడ నెగడక
పరులలిగిన నలుగనతఁడు పరముఁడు సుమతీ!

71. పరసతి కూటమిఁ గోరకు
పరధనముల కాసపడకు పరునెంచకుమీ
సరిగాని గోష్ఠిఁజేయకు
సిరిచెడి చుట్టంబుకడకుఁ జేరకు సుమతీ!

72. పరసతుల గోష్ఠినుండిన
పురుషుఁడు గాంగేయుఁడైన భువి నిందపడున్
గరిత సుశీలయ్యైనను
పరుసంగతినున్న నిందపాలగు సుమతీ!

69. కార్యే దాసీ రతౌ రంభా సచివా మంత్రణేష్వపి।
పోషణే జననీ చాపి పుంసఃస్యాత్సుమతే సతీ॥

70. సోదరః పరనారీణాం తుష్టః పరహితే రతః।
స్తుతినిందాసమో యస్స సుమతే పురుషోత్తమః॥

71. మా రజ్యస్వ పరస్త్రీషు పరస్వాని చ మా గృధః
మా పరాపవాదభాషస్వ మార్గ్యతాం సుమతేఽధమః

72. భీష్మేఽప్యన్యసతీ గోష్ఠ్యా భువి నిందాం ప్రపద్యతే।
తద్దైవాస్త్ర్యపతౌ వాసాత్సుమతే శీలవత్యపి॥

73. పసు నాత్మఁదలఁచు సతి విడు
పఱుమాటలు పలుకుసుతుల మన్నింపకుమీ
వెఱపెఱుఁగని భటునేలకు
తఱచుగ సతిఁగవయబోకు తగదుర సుమతీ!

74. పరులకు స్వేష్టము నెప్పకు
పొరుగిండ్లకుఁ బనులులేక పోవకుమెపుడున్
బిరుగదిసిన సతిగవయకు
మెఱిఁగియుఁ బిరుసైన హయము నెక్కకు సుమతీ!

75. పర్వముల సతులఁగవయకు
ముర్వీశ్వరు కరుణనమ్మి యుబ్బకు మదిలో
గర్వింప నాలిఁబెంపకు
నిర్వహణము లేనిచోట నిలువకు సుమతీ!

76. పలుదోమి చేయువిడియము
తలగడిగిన నాఁటినిద్ర తరుణులతోడన్
బొలయలుక నాఁటికూటమి
వెలయింతని చెప్పరాదు వినురా సుమతీ!

73. జహీహ్యన్యహృదం భార్యాం మా ప్రతీపం సుతం భజ।
అవిధేయం భటం మా గాః స్త్రీలౌల్యం సుమతే జహి॥

74. మావిష్కార్షీర్మతింస్వీయాం మా గమోఽన్యంనిరర్థకమ్
మాఽఽరంసీః పరదారాన్మ దృప్తాశ్వం సుమతే భజ॥

75. భార్యాంపర్వసు నోపేయాత్ నహృష్యేద్దయయాప్రభోః।
న లాలయేత్ కలత్రం చ న తిషేత్ సుమతేఽపదే॥

76. ధౌతద స్త్రస్య తామ్బూలం మానిన్యా సహ సంగమః
అభ్యక్తస్నాతసుప్తిశ్చ సుమతే వర్ణనాతిగాః॥

77. పాటెఱుఁగనిపతి కొలువును
గూటంబున కెఱుకపడని కోమలి రతియున్
బేటెత్తఁజేయు చెలిమియు
నేటికి నెదురీఁదినట్లు లెన్నఁగ సుమతీ.

78. పాలనుగలసిన జలమును
బాలవిధంబుననె యుండుఁ బరికింపంగాఁ
బాలచవిఁ జెఱచుఁ గావునఁ
బాలసుఁడగు వానిపొందు వలదుర సుమతీ.

79. పాలసునకైన యాపద
జాలింబడి తీర్పఁదగదు సర్వజ్ఞునకున్
దేలగ్నిఁబడఁగఁ బట్టిన
మేలెఱుఁగునె మీటుఁగాక మేదిని సుమతీ.

80. పిలువని పనులకుఁ బోవుట
కలియని సతిరతియు రాజు గానని కొలువున్
బిలువని పేరంటంబును
వలవని చెలిమియును జేయవలదుర సుమతీ.

77. సేవాఽక్లేశవిదః పత్యుః ముగ్ధాయా మోషితో ఽరిః।
తర్పితాభంజకః స్నేహః ప్రతీపం సుమతే ప్లవమ్॥

78. సలిలం క్షీరసమ్మిశ్రం క్షీరవద్భాసతే బహిః।
భంజయేత్తు రసం తస్య తథైవ సుమతే ఖలః॥

79. న కదాప్యుపకుర్వీత దుష్టమాపద్వశం గతమ్।
వృశ్చికో రక్షితోఽప్యగ్నేః న దశేత్ సుమతే కిము॥

80. అయాచితచికీర్షుత్వం అరక్తతరుణీరతిః।
వర్జ్యా కింధూపసేవా చ సుమతేఽనార్యసంగతిః॥

81. పురికిని బ్రాణము కోమటి
వరికిని బ్రాణంబు నీరు వసుమతిలోనన్
గరికిని బ్రాణము తొండము
సిరికిని బ్రాణంబు మగువ సిద్ధము సుమతీ!

82. పులిపాలు దెచ్చి యిచ్చిన
నలవడఁగా గుండెఁ గోసి యఱచేత నిడినన్
దలపొడుగు ధనముఁ బోసిన
వెలయాలికిఁ గూర్మిలేదు వినురా సుమతీ!

83. పెట్టిన దినములలోఁపల
నట్టడవులకైన వచ్చు నానార్థములున్
బెట్టని దినములఁ గనకపు
గట్టెక్కిన నేమిలేదుగదరా సుమతీ!

84. పొరుగునఁ బగవాఁడుండిన
నిరవొందగ వ్రాతగాఁడె యేలికయైనన్
ధరఁగాపు కొండెమాడినఁ
గరణాలకు బ్రతుకులేదుగదరా సుమతీ!

81. పత్తనస్య నదీస్రోత్యాణాః కలశస్య జలం తథా।
కరిణశ్చ పతో యోషా సంపదః సుమతే భువి॥

82. వదద్వాత్ర్యుపయః ఛిత్త్వా హృదయం పాల్ప్యయన్ కరే।
యచ్ఛన్ ఘారిధనం వేశ్యాం సుమతే నైవ రంజయేత్॥

83. ఆయాన్త్యటవీమధ్యం సర్వార్థాః సుముఖే విధౌ।
మేరావపి న లభ్యాస్తే సుమతే విముఖే విధౌ॥

84. ప్రాతివేశ్యే నరే శత్రౌ వ్యవహారపటే ప్రభౌ।
కృషికే పిశునే నాశః సుమతే కరణస్య హి॥

85. బంగారు కుదువఁ బెట్టకు
సంగరమునఁ బాఱిపోకు సరసుఁడవగుచో
అంగడి వెచ్చములాడకు
వెంగలితోఁ జెలిమివలదు వినరా సుమతీ!

86. బలవంతుఁడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమల చేతఁజిక్కి చావదె సుమతీ!

87. మండలపతి సముఖంబున
మెండైన ప్రధానిలేక మెలఁగుట యెల్లన్
గొండంత మదపుటేనుఁగు
తొండము లేకుండినట్లు దోచుర సుమతీ!

88. మంత్రిగలవాని రాజ్యము
తంత్రము చెడకుండ నిలుచుఁ దఱచుగ ధరలో
మంత్రివిహీనుని రాజ్యము
జంత్రపుఁగీలూడినట్లు చౌకర సుమతీ!

౮౫ మా గ్రహీస్త్వంఋణంహేమ్నా మాపలాయస్వ సంగరే।
మా క్రీడార్థస్పృణం వాదీః మా సఖ్యం సుమతేఽసతా॥

౮౬. కిం మే బలవతశ్ఛిన్నమితి మా బహ్వారిర్భవః।
పిపీలికావశం ప్రాప్తో మ్రియతే సుమతే ఫణీ॥

౮౭ సచివేన వినాభూతో భూజానిః సద్యశో ధ్రువమ్।
శుణ్డాదణ్డవిహీనేన కరిణా సుమతే శృణు॥

౮౮. సామాత్యం భూభృతోరాజ్యంమంత్రగుప్తేః స్థిరంభవేత్।
యథాఙ్గవికలం యన్త్రం సుమతేఽస్యత్తు సీదతి॥

89. మాటకుఁ బ్రాణము సత్యము
కోటకుఁ బ్రాణంబు సుభటకోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ!

90. మానఘనుఁ డాత్మధృతిఁ జెడి
హీనుండగువాని నాశ్రయించుట యెల్లన్
మానెఁడు జలముల లోపల
నేనుఁగు మెయి దాఁచినట్టు లెఱుఁగుము సుమతీ!

91. రా పొమ్మని పిలువని యా
భూపాలునిఁ గొల్వ భుక్తిముక్తులుగలవే
దీపంబు లేనియింటను
జేపుణికిళ్లాడినట్లు సిద్ధము సుమతీ!

92. రూపించి పలికి బొంకకు
ప్రాపగుచుట్టంబునెగ్గు పలుకకు మదిలోఁ
గోపించు రాజుఁ గొల్వకు
పాపపుదేశంబు సొరకు పదిలము సుమతీ!

93. లావుగల వానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు బలవంతుండౌ
గ్రావంబంత గజంబును
మావటివాఁ డెక్కినట్లు మహిలో సుమతీ!

94. పఱదైనఁ జేనుదున్నకు
కఱవైనను బంధుజనుల కడకేఁగకుమీ
పరులకు మర్మము సెప్పకు
పిఱికికి దళవాయితనముఁ బెట్టకు సుమతీ!

95. వరిపంట లేని యూరును
దొరయుండని యూరు తోడు దొరకని తెరువున్
ధరను బతిలేని గృహమును
నరయంగా రుద్రభూమి యనఁదగు సుమతీ!

96. వినఁదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁదగున్
గని కల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలో సుమతీ!

93. శారీరకబలోపేతాన్స్మృతిమాన్ బలవత్తరః।
ఆఘోరణో నయేన్నాగం శైలాభం సుమతే వశమ్॥

94. అనూపం న కృషేద్దేశం న గచ్ఛేద్వృష్టమాపది।
నాన్యం బ్రూయాత్స్వకం ఛిద్రం సధీరోః సుమతే రణః॥

95. అసస్యోఽస్వామికో గ్రామో మార్గోఽనుచరవర్జితః।
దేశో భూపవిహీనశ్చ సుమతే రుద్రభూసమాః॥

96. శ్రోతవ్యం సర్వతో మర్త్యైత్ శ్రుతం సమ్యగ్విచారయేత్
సత్యాసత్యే తతో జానన్ కథ్యతే సుమతే సుధీః॥

97. ఓడెము సేయని నోరును
జేడెల యధరామృతంబుఁ జెందని నోరున్
బాడంగరాని నోరును
బూడిద కిరవైన పాడుబొందర సుమతీ!

98. వెలయాలి వలనఁ గూరిమి
కలుగదు మఱి కలిగెనేనిఁ గడతేఱదుగా
పలువురు నడచెడు తెరువునఁ
బులు మొలవదు మొలిచెనేనిఁ బొదలదు సుమతీ!

99. శుభముల నొందని చదువులు
నభినయమును రాగరసము నందనిపాటల్
అభిలాషలేని కూటము
సభమెచ్చని మాటలెల్లఁ జప్పన సుమతీ!

100. సరసము విరసము కొఱకే
పరిపూర్ణ సుఖంబు లధికబాధలకొఱకే
పెరుగుట విరుగుటకొఱకే
ధరతగ్గుట హెచ్చుకొఱకె తథ్యము సుమతీ!

97. అనాస్వాదితతామ్బూలమపీతకలపానకమ్।
అగాననిపుణం చాస్యం సభస్మ సుమతే బిలమ్॥

98. వేశ్యాయాః ప్రణయో న స్యాత్సంఘాతోఽపి న చ స్థిరః
న రోహతి తృణం మార్గే విసర్పేత్ సుమతే భవత్॥

99. అకల్యాణకరీ విద్యా గీతం చారసచర్వణమ్।
అనుత్సాహీ సఖా వ్యర్థాప్యసభ్యం సుమతే వచః॥

100. కలహాయ పరీహాసో దుఃఖాయ సుఖసంతతిః।
హాసాయ చ భవేద్వృద్ధిః పాతో క్షే సుమతే వృథే॥

101. మేలెంచని మాలిన్యుని
మాలను సగసాలవాని మంగలి హితుగా
నేలిన నరపతి రాజ్యము
నేలఁ గలసిపోవుఁగాని నెగడదు సుమతీ!

102. స్త్రీలయెడ వాదులాడకు
బాలురతోఁ జెలిమిసేసి భాషింపకుమీ
మేలైన గుణము విడువకు
మేలిసపతినింద సేయ కెన్నఁడు సుమతీ!

103. సిరి దా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళసలిలము భంగిన్
సిరిదాఁ బోయినఁ బోవును
గరిమ్రింగిన వెలగపండు కరణిని సుమతీ!

104. మది నొకని వలచియుండఁగ
మదిచెడి యొకక్రూరవిటుఁడు మానక తిరుగున్
అది చిలుక పిల్లి పట్టినఁ
జదువునె యాపంజరమున జగతిని సుమతీ!

101. కృతఘ్నః స్వర్ణకారశ్చ చణ్డాలో నాపిత స్తథా।
ప్రియో యస్య ప్రభో రాజ్యం సుమతే తస్య నశ్యతి॥

102. మా భూత్ స్త్రీష్వపవాదస్తే మా సఖ్యం కురు బాలకైః।
ఆదేయా గుణితా, హేయా సుమతే స్వామిగర్హణా॥

103. ఆయాత్యేవ స్వయం సంపన్నారికేళజలం యథా।
అపైతి కరిణా జగ్ధం కపిత్థం సుమతే యథా॥

104. అన్యాసక్తాం స్త్రియం మూఢస్తామ్యతీప్సుః ముధా విటః।
కిం బిడాలవశ శ్చారు సంలపేత్ సుమతే శుకః॥

105. పుత్రోత్సాహము తండ్రికిఁ
బుత్రుఁడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్రునిఁ గనుగొని పొగడఁగఁ
బుత్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ!

106. వెలయాలు సేయు బాసలు
వెలయఁగ నగసాలిపొందు వెలమలచెలిమిన్
గలలోనఁ గన్నకలిమియు
విలసితముగ నమ్మరాదు వినురా సుమతీ!

107. వేసరపు జాతిగానీ
వీసముఁ దాఁ జేయనట్టి వెంగలిగానీ
దాసికొడుకైనఁగానీ
కాసులు గలవాఁడె రాజు గదరా సుమతీ!

108. సరపతులు మేరఁదప్పినఁ
దిరమొప్పఁగ విధవ యింటఁ దీర్పరియైనన్
గరణము వైదికుఁడైనను
మరణాంతక మౌనుగాని మానదు సుమతీ!

105\. జన్మమాత్రాన్న తావత్త్వం పితా పుత్రస్య విద్యతే।
హార్షం తస్య గుణాధిక్యా ద్భావత్త్వం సుమతే ధ్రువమ్॥

106\. వారాఙ్గనాయాశ్శపథః. స్వర్ణకారస్య సౌహృదమ్।
విభవః స్వప్నసిద్ధిష్టః శ్రద్ధేయః సుమతే న హి॥

107\. జాయతా మన్వయే నీచే మాస్తు కార్యేషు దక్షతా।
దాసీపుత్రో భవేద్వాపి సంపన్నః సుమతే ప్రభుః॥

108\. నిర్మర్యాదో మహీజానిః విధవా గృహనాయికా।
కరణో వైదికశ్చాపి సుమతే మృత్యుదేవతా॥

ఆంగ్లీనిబద్ధప్రతిభైః కవివేమనస్య
పద్యానియానిచనలోకహితోపయుంజి।
గీర్వాణవాచి పరివృత్తి మవాపితాని
దోషాయదీహపరివర్తయితుర్నకర్తుః॥

శ్రీరస్తు

దేశభాషలందు తెలుఁగు లెస్స

# వేమన శతకము

( తెలుఁగు మూలము )

1 కం. శ్రీపదుమాపతి యగు నా
స్వామికి దాసుండనంగ జగములు పొగడన్
వేమన యనియెడు ధీరుఁడు
నేమంబునఁ జెప్పెఁ దీని నిజముగ వేమా!

2. ఆ. అంకిలెఱిఁగి మాటలాడ నేర్చినయప్డె
పిన్నపెద్దతనము లెన్న నేల?
పిన్నచేతిదివ్వె పెద్దగా వెలుఁగదా
విశ్వదాభిరామ వినుర వేమ!

3. కం. అడుగఁదగువారి నడుగుట
యిడినయెడం గొసరకుంట యీలేననఁగాఁ
గడుసై వేడకయుండుట
యడిగెడువారలకు నీతి యగురా వేమా!

శ్రీః

వాణీం భజత గైర్వాణీమ్॥

# వే మ న శ త క మ్

( ఆంధ్ర్యా అనువాదః )

1. శంభోరుమాపతేర్దాస ఇతి పాత్రం జనస్తుతేః।
ఉవాచ వేమనో ధీరో వేమేవం లోకమంగళమ్॥

2. యుక్తం విజ్ఞాయ వదతాం న వచోభేద శక్యతే।
జ్వలేద్బాలస్య దీపోఽపి శ్రూయతాం వేమ విశ్వద॥

3. యాచ్యన్తాం యాచితుం యోగ్యా దత్తాత్కాంక్ష్యం
న చాధికమ్।
అదదానో న చాభ్యర్థ్యః శ్రూయతాం వేమ విశ్వద॥

4. ఆ. అనువు గానిచోట నధికులమనరాదు
కొంచెముండుటెల్ల కొదువ గాదు
కొండ యద్దమందుఁ గొంచెమై యుండదా?
విశ్వదాభిరామ వినుర వేమ!

5. ఆ. అల్పబుద్ధివాని కధికారమిచ్చిన
దొడ్డవారి నెల్లఁ దొలఁగఁగొట్టుఁ
జెప్పుఁదినెడుఁగుక్క చెఱకుతీపెఱుఁగునా
విశ్వదాభిరామ వినుర వేమ!

6. ఆ. అల్పుఁడెపుడుఁ బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కుఁ జల్లగాను
కంచు మ్రోఁగునట్లు కనకంబు మ్రోఁగునా
విశ్వదాభిరామ వినుర వేమ!

7. ఆ. అరయఁ దఱచు కల్లలాడెడువారింట
వెడలకేల లక్ష్మి విశ్రమించు
నీరమోటికుండ నిలువనిచందాన
విశ్వదాభిరామ వినుర వేమ!

1 నాస్థానేఽధికతా పాత్యా నైచ్యోత్కర్షః స్థానస్య న క్షితిః।
కింనాపిత్యేనఘోఽల్పాంస్యాత్ శ్రూయతాం వేమ విశ్వద॥

5. అల్పైరధికారస్థః సతో నిష్కాసయేత్ ధ్రువమ్।
పర్ణ ఘుత్తే న వేషం శ్వా శ్రూయతాం వేమ విశ్వద॥

6. అల్పో వదతి సాటోపం ప్రశాన్తం సజ్జనః పునః।
కాంస్యవత్క్వణం స్వనేత్స్వర్ణం శ్రూయతాం వేమ విశ్వద॥

7. యే వదన్త్యనృతం శశ్వత్ తేషు లక్ష్మీ ర్నతిష్ఠతి।
యథామ్భః శిథిలే కుమ్భే శ్రూయతాం వేమ విశ్వద॥

8. ఆ. ఆఁకటికిఁ దొలంగు నాచారవిధులెల్ల
చీఁకటికిఁ దొలంగుఁ జిత్తశుద్ధి
పేఁకటికిఁ దొలంగు వెనుకటి బిగువెల్ల
విశ్వదాభిరామ వినుర వేమ!

9. ఆ. అన్నమడుగువాని కన్నంబుఁ బెట్టిన
నీశుకిచ్చినంత హితము గాదె
లేనివానికిడఁగ లేశంబు ఘనమగు
విశ్వదాభిరామ వినుర వేమ!

10. ఆ. ఆత్మశుద్ధి లేని యాచారమది యేల
భాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధి లేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినుర వేమ!

11. ఆ. తీర్పనార్పలేని తీర్పరితనమును
కూర్పవిప్పలేని నేర్పుపనులు
పెట్టిపోయలేని వీరముల్ వ్యర్థముల్
విశ్వదాభిరామ వినుర వేమ!

8. అపాత్రః శ్రద్ధయాఽప్యేతి చిత్తశుద్ధిప్రమోదనాత్।
పాత్రైస్తైరర్థ్యం విపద్భిశ్చ శ్రూయతాం వేమ విశ్వద॥

9. దత్తం చేత్తుదితాయాస్మిన్ శ్వానాయేవ సార్థకమ్।
రిక్తాయేవ కృతం దానం శ్రూయతాం వేమ విశ్వద॥

10. ఆత్మశుద్ధౌ కిమాచారాత్ చిత్తాశుద్ధౌ శివార్చనాత్।
పాత్రాశుద్ధౌ ఫలం పాకాత్ శ్రూయతాం వేమ విశ్వద॥

11. నిర్ణయాదక్షమాధ్యస్థ్యం ఘటనాపటునైపుణీ।
అదాతుస్సంభ్రమో వ్యర్థః శ్రూయతాం వేమ విశ్వద॥

12. ఆ. ఆశ పాపజాతి యన్నింటికంటె నా
యాసచేత యతులు మోసపోరె
చూచి విడచువారు శుద్ధాత్ములెందైన
విశ్వదాభిరామ వినుర వేమ!

13 క. ఇచ్చెడువారల సంపద
హెచ్చెడిసే గాని లేమి యెట్లు కలుగురా
నిచ్చెలమసీటిఁ జల్లిన
పిచ్చలవిడి నూరుచుండు వినరా వేమా!

14. ఆ. ఇచ్చువానియొద్ద సీనివాఁడుండినఁ
జచ్చుఁగాని యీవి సాగనీఁడు
కల్పతరువుక్రింద గ్రచ్చచెట్టున్నట్టు
విశ్వదాభిరామ వినుర వేమ!

15. ఆ. ఇంటిలోని ధనము నిది నాది యనుచును
మంటిలోన దాఁచు మంకుజీవి
కొంచుఁబోఁడు వెంట గుల్లకాసును రాదు
విశ్వదాభిరామ వినుర వేమ!

12. ఆశా నర్తక్రి పాపిష్ఠా యుం మోహయిత్వా నరాః।
ప్రాప్తత్యాగి విశుద్ధాత్మా శ్రూయతాం వేమ విశ్వద॥

13. వర్ధతే విభవో దాతుః క్షీయతే న కదాచన।
కూపే తోయమివోద్ధృతే శ్రూయతాం వేమ విశ్వద॥

14. దాతుర్దానమదాతా స్వైః ప్రాణై ర్వారయతే సదా।
లతా దుష్టేవ కల్పద్రోః శ్రూయతాం వేమ విశ్వద॥

15. గృహే ధనం మమైవేతి లుబ్ధో రక్షతి భూతలే।
న కాచోఽప్యేనమస్త్వేతి శ్రూయతాం వేమ విశ్వద॥

16. ఆ. ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు
కాచి యతుకనేర్చుఁ గమ్మరీఁడు
మనసు విఱిగెనేని మఱి యంటనేర్చునా
విశ్వదాభిరామ వినుర వేమ!

17. ఆ. ఇమ్ము దప్పువేళ నెమ్మెలన్నియుఁ దప్పుఁ
గాలమొక్కరీతి గడుపవలయు
విజయుఁడనువుఁ దప్పి విరటుని గొల్వఁడా
విశ్వదాభిరామ వినుర వేమ!

18. ఆ. ఇయ్యనతనిచేత నిప్పించుఁ దనప్రాప్తి
యిచ్చువానిచేత నీయనీదు
ఇచ్చుఁ గైకొనంగ నీశ్వరుఁడే కర్త
విశ్వదాభిరామ వినుర వేమ!

19. ఆ. పట్టి శ్రమయ కాని వరమీశుఁడిచ్చునా
చేటు గలుగువేళఁ జేరి కొలువ
సుఖము గలుగువేళఁ జూడంగఁబడెనొకో
విశ్వదాభిరామ వినుర వేమ!

16. త్రేధా ఛిన్నమయస్తప్తం లోహకారేణ యోజ్యతే
మనస్తు భిన్నం నైకంస్యాత్ శ్రూయతాం వేమ విశ్వద॥

17. దైవలోపాత్ సుఖం నశ్యేత్ సమచిత్తః కుతో భవేత్।
భృత్యోఽభూద్విపదా పార్థః శ్రూయతాం వేమ విశ్వద॥

18. అపాత్రా కారయేఽ దానం పాత్రా దానవిపర్యయమ్।
అలంఘ్యో విధి లేఖస్య శ్రూయతాం వేమ విశ్వద॥

19 ఈశ్వరో విషమే ధ్యాతో న ప్రసీదేత్ వృథా శ్రమః।
కుతోఽసౌ న సుఖే దృష్టః శ్రూయతాం వేమ విశ్వద॥

20. ఆ. కులములోన నొకఁడు గుణహీనుఁడుండినఁ
గులము చెడును వానిగుణమువలన
వెలయుచెఱకునందు వెన్ను వెడలినట్లు
విశ్వదాభిరామ వినుర వేమ!

21. ఆ. ఉద్ధరింపఁ గలుగు నుత్తముండు కులంబు
మధ్యముండు దాని మాటఁ గనఁడు
అధముఁడై నవాఁడడంగించు నొక్కట
విశ్వదాభిరామ వినుర వేమ!

22. ఆ. ఉప్పుఁ గప్పురంబు నొక్కపోలికనుండుఁ
జూడఁజూడ రుచులజాడ వేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా
విశ్వదాభిరామ వినుర వేమ!

23. ఆ. ఋణమొసంగునాతఁడినుఁడగుఁ దొలుదొల్త
నదియు మరల నడుగ యముఁడుగ నగు
నప్పుఁ జేసి తీర్పనఱయని వారికి
విశ్వదాభిరామ వినుర వేమ!

20. సాధోర్మహాత్మనః సంఘాతః సాధయత్యభిలాషితమ్।
మాధుర్యం మంజరీవేశోః శ్రూయతాం వేమ విశ్వద॥

21. ఉద్ధరత్యుత్తమో వంశం మధ్యమ స్తముపేక్షితే।
అధమ స్తదపఃకారీ శ్రూయతాం వేమ విశ్వద॥

22. కర్పూరక్షీరయోరూపం తుల్యం భిన్నస్తు తద్రసః
పుణ్యపాపనరేష్వేవం శ్రూయతాం వేమ విశ్వద॥

23. ఋణదానే భవేత్పూషా శోధనప్రార్థనే యమః।
ఉత్తమర్ణో౽ధమర్ణస్య శ్రూయతాం వేమ విశ్వద॥

24. ఆ. తత్త్వవేత్తగాక ధరలోనఁ దెలియుఁడు
నిజము కల్ల రెండు నిక్కముగను
వినికి మాత్రగాని వివరింప వీలౌనె
విశ్వదాభిరామ వినుర వేమ!

25. ఆ. ఆశ భూతమట్లు నాశించియుండఁగ
నరుఁడు వశముఁ దప్పి తిరుగుఁ దిరుగుఁ
గుక్కచేసు దగను జిక్కగా నీయాశ
విశ్వదాభిరామ వినుర వేమ!

26. ఆ. ఎంత చదువుఁ జదివి యెన్నియో విన్నను
హీనుఁడవగుణంబు మానలేఁడు
బొగ్గు పాలఁగడుగఁ బోవునా నైల్యంబు
విశ్వదాభిరామ వినుర వేమ!

27. ఆ. ఒకనిఁ జెఱుతుమంచు నుల్లమందెంతురు
తమకుఁ గలుగుచేటుఁ దామెఱుఁగక
తమ్ముఁ జెఱచువాఁడు దైవంబు గాఁడొకో
విశ్వదాభిరామ వినుర వేమ!

24. సత్యాసత్త్వే న విజ్ఞేయే అవిద్యాజ్ఞాతృభిర్జనైః।
న వ్యాఘ్ర్యే శ్రుతే ఏవ శ్రూయతే వేమ విశ్వద॥

25. అశాపితాపికాపిష్టః బంభ్రమీత్యుపశో నరః
కథ ఏవోఽపితాలేయం శ్రూయతే వేమ విశ్వద॥

26. అధీతశ్రుతశాస్త్రోఽపి న నీచో దోషముజ్ఝతి।
క్షీరాన్నైర్మల్యమివాఙ్గారః శ్రూయతాం వేమ విశ్వద॥

27. యైర్నాకః చిన్తితేఽన్యస్య స్వీయం తే నవిదుః తతః।
కిం తే దైవహతా న స్యుః శ్రూయతాం వేమ విశ్వద॥

28. ఆ. ఎంతసేవఁ జేసి యేపాటు పడినను
రాచమూక నమ్మరాదురన్న
పాముతోడిపొందు పదివేలకైనను
విశ్వదాభిరామ వినుర వేమ!

29. ఆ. ఎద్దుకన్నఁ దెలియ నెనుబోతు తక్కువ
వివరమెఱిఁగి చూడు వృత్తియందు
నేర్పులేనివాని నెఱయోధుఁ డందురా
విశ్వదాభిరామ వినుర వేమ!

30. ఆ. ఎద్దుకైనగాని యేడాది తెల్పిన
మాటఁ దెలిసి నడచు మర్మమెఱిఁగి
మొప్పె తెలియలేఁడు ముప్పదేండ్లకునైన
విశ్వదాభిరామ వినుర వేమ!

31. ఆ. ఎఱుఁగువానిఁ దెలుప నెవ్వఁడైనను జాలు
బమ్మ వసము గాదు బండఁదెలుప
నేటివంకఁ దీర్ప నెవ్వరి తరమయా
విశ్వదాభిరామ వినుర వేమ!

28. సేవ్యమానం బహుక్లేశైః విశ్వాస్యం న హి రాజకమ్।
సర్పస్నేహో హి తత్సంగః శ్రూయతాం వేమ విశ్వద॥

29. ఊనా హి మహిషా గోభ్యో మూర్ఖత్వం తత్ర కారణమ్।
కథం స్యాత్ నిర్గుణో యోధః శ్రూయతాం వేమ విశ్వద॥

30. వినేయస్స్యాద్బలీవర్దో వర్షైరేకేన శిక్షితః।
న తు మూర్ఖః శతాబ్దీభ్యః శ్రూయతాం వేమ విశ్వద॥

31. సర్వైర్బోధ్యో విజిజ్ఞాసుః మూర్ఖో న బ్రహ్మణా పునః।
కేనావక్రా నదీ కార్యా శ్రూయతాం వేమ విశ్వద॥

32. ఆ. ఏఱుదాఁటి మెట్టవేగిన పురుషుండు
పుట్టి నరకుఁ గొనక పోవుఁ గాదె
పసులు దీరిసంతఁ బరులఁ బాటించునా
విశ్వదాభిరామ వినుర వేమ!

33. ఆ. పరమతత్త్వమొక్కటావశ్యకంబెప్డు
దాని బలిమి యెంతయైనఁ గూడు
గడ్డిపెంటిఁబెట్టి కట్టగా యేమగును
విశ్వదాభిరామ వినుర వేమ!

34. ఆ. ఐదువ్రేళ్ళబలిమి హస్తంబు పనిఁ జేయు
నందొకటియు వీడ బొందిక చెడు
స్వామియుఁవొకఁడు విడిన చెడుఁగదా పనిబల్మి
విశ్వదాభిరామ వినుర వేమ!

35. ఆ. ఎంతనేర్పుతోడ నేమేమి చదివినఁ
జింతలేని విద్య చిక్కఁబోదు
పంతగించి మదినిఁ బరికించి చూడరా
విశ్వదాభిరామ వినుర వేమ!

32 తీర్ణ్వా నదీం గతః పారం స పోతం గణయేన్నరః।
కృతార్థా విముఖా హి స్యుః శ్రూయతాం వేమ విశ్వద॥

33. ఐకమత్యముపేయం నః తత్త్రాహుః సర్వసమ్పదః।
గజబద్ధి గుణస్తార్ణైః శ్రూయతాం వేమ విశ్వద॥

34. పంచాంగులీభిర్హస్తస్య చేష్టా న త్వేకయా వినా।
స్వీయనాశే జలం నశ్యేత్ శ్రూయతాం వేమ విశ్వద॥

35. విద్యా సర్వాస్వపేక్షితాపి మృగ్యా సా చిత్తయోజ్ఝితా।
తత్త్వమేతద్విజానీహి శ్రూయతాం వేమ విశ్వద॥

36. ఆ. ఓగు నోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని
భావమిచ్చి మెచ్చుఁ బరమలుబ్ధుఁ
బంది బురద మెచ్చుఁ బన్నీరు మెచ్చునా
విశ్వదాభిరామ వినుర వేమ!

37. ఆ. ఔనటంచునొక్కఁడాడిన మాటకుఁ
గాదనంచుఁ బలుక క్షణముపట్టు
దాని నిలువఁదీయఁ దాతలు దిగవలె
విశ్వదాభిరామ వినుర వేమ!

38. ఆ. కండచక్కెరయును గలియఁ బాల్పోసినఁ
దఱిమి పాము తన్నుఁ దాఁకుఁ గాదె
కపటమున్నవానిఁ గనిపెట్టవలెనయా
విశ్వదాభిరామ వినుర వేమ!

39. ఆ. కలిమి గలుగ సకలకులములకెక్కువ
కలిమి భోగభాగ్యములకు నెలవు
కలిమిలేనివాని కులమేమి కులమయా
విశ్వదాభిరామ వినుర వేమ!

36. అత్రార్ఘ్యం రోచతేఽజ్ఞాయ ఉష్ట్రాయ సరసం పయః
పంకం సూకరబృందాయ శ్రూయతాం వేమ విశ్వద॥

37. అన్యేన స్థాపితం పక్షం క్షణే నైకేన ఖణ్డయేత్।
ధాతా తన్మండనే నాలం శ్రూయతాం వేమ విశ్వద॥

38. శర్కరాక్షీరదం సర్పః నదశ త్యనుధావ్య కిమ్।
వర్జనీయః సదా దుష్టః శ్రూయతాం వేమ విశ్వద॥

39. ధనితాయాః కులీనత్వం స్థానం సా భోగభాగ్యయోః।
అధనస్య కులం నాస్తి శ్రూయతాం వేమ విశ్వద॥

40 ఆ. కల్లుకుండకెన్ని ఘనభూషణములిడ్డ
నందులోని కంపు చిందులిడదె
తులువ చదివికొన్నఁ దొలిగుణ మేమగు
విశ్వదాభిరామ వినుర వేమ!

41. ఆ. కానివానితోడఁ గలసి మెలంగిన
హాని వచ్చునెంతవానికైన
సీఁగ కడుపుఁదెచ్చి యిట్టట్టు సేయదా
విశ్వదాభిరామ వినుర వేమ!

42. ఆ. కుక్క యెద్దు కాదు కుందేలు వ్యాఘ్రంబు
దోమ కాదుగాని సామజంబు
లోభివాఁడు కాఁడు లోకంబునను దాత
విశ్వదాభిరామ వినుర వేమ!

43. కం. జనకమువలె సేవింపుము
ఘనతర స్నేహంబునడపు కాకములవలెఁజా-
తనరుము గాడిదలాగున
వినుతింపందగినతాల్మి వీడక వేమా!

44. ఆ. కోతిఁ బట్టి తెచ్చి క్రొత్తపుట్టముఁ గట్టి
కొండ్రముచ్చులెల్లఁ గొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు
విశ్వదాభిరామ వినుర వేమ!

45. ఆ. కోపమునను ఘనత కొంచెమై పోవును
గోపమునను మిగుల గోడుఁ జెందుఁ
గోపమడఁచెనేని కోరికలీడేరు
విశ్వదాభిరామ వినుర వేమ!

46. ఆ. గంగిగోవుపాలు గంటెడైనను జాలుఁ
గడవెడైన నేమి ఖరముపాలు
భక్తిగలుగుకూడు పట్టెడైనను జాలు
విశ్వదాభిరామ వినుర వేమ!

47. ఆ. గంగ పాఱుచుండుఁ గదలనిగతితోడ
ముఱికివాగు పాఱు మ్రోఁతతోడ
నధికుఁడోర్చునట్టులధముఁడోర్వగ లేఁడు
విశ్వదాభిరామ వినుర వేమ!

44. గోలాంగూలైః సమం వస్త్రం యథా విత్రాస్యతే వృషైః।
దుష్టో జనః తథా భూత్యై శ్రూయతాం వేమ విశ్వద॥

45. ఆర్యతా హీయతే క్రోధాత్ దుఃఖంక్రోధాత్భవేత్భృశమ్।
ఆప్తకామో జితక్రోధః శ్రూయతాం వేమ విశ్వద॥

46. దర్వీమాత్రం పయః గవ్యం కుంభమాత్రం న గార్దభమ్।
భక్త్యా దత్తం వరంచాల్పం శ్రూయతాం వేమ విశ్వద॥

47. భాగీరథ్యా గతిః శాంతా క్షుద్రనద్యాస్ససంభ్రమా।
సదసద్వర్తనం హ్యేవం శ్రూయతాం వేమ విశ్వద॥

48. ఆ. గాడ్దె మేసునిండ గంధంబు పూసిన
సేమెఱుంగలేక యెగసి తన్ను
మూర్ఖుఁడైనవానిఁ బూజింపనీలాగు
విశ్వదాభిరామ వినుర వేమ!

49. ఆ. గుణయుతునకు మేలు గోరంత జేసినఁ
గొండ యగును వానిగుణముచేతఁ
గొండయంత మేలు గుణహీనుఁడెఱుఁగునా
విశ్వదాభిరామ వినుర వేమ!

50. ఆ. గురునిశిక్ష లేక గుఱుతెట్లు కల్గునో
యజునకైన వానియబ్బకైన
తాళపుఁజెవి లేక తలుపెట్లులూడును
విశ్వదాభిరామ వినుర వేమ!

51. ఆ. గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ జేకొనిపోవఁ
బండులూడఁ దన్నుఁ బాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా
విశ్వదాభిరామ వినుర వేమ!

48. ఖరః చందనలిప్తాంగః పద్భ్యాం హన్తి యథాప్రా।
మూర్ఖపూజాఫలం హ్యేతత్ శ్రూయతాం వేమ విశ్వద॥

49. గుణిన్యు పకృతే శ్లేశః గిరివ ద్గురుతాం భజేత్।
విపరీతం భవే ద్దుష్టే శ్రూయతాం వేమ విశ్వద॥

50. గురుం వినా భవేద్ జ్ఞానీ బ్రహ్మ తజ్జనరోఽపి కిమ్।
పేటికా కుంచికోద్ఘాట్యా శ్రూయతాం వేమ విశ్వద॥

51. దుధుక్షుర్ధేనుకాం వంధ్యాం పచ్‌హతిం న పయోశ్నుతే।
లుబ్ధియాజ్ఞా తథా మోఘా శ్రూయతాం వేమ విశ్వద॥

52. ఆ. గాజుకుప్పెలోనఁ గదఁగు దీపంబెట్లు
నిండుకుండలోన నీరమెట్లు
నిశ్చలాత్మ యట్లు నిర్వికారంబుగా
విశ్వదాభిరామ వినుర వేమ!

53. ఆ చిక్కియున్నవేళ సింహంబునైనను
బక్కకుక్కయైన బాధఁజేయు
బలిమిలేనివేళఁ బంతముల్ చెల్లవు
విశ్వదాభిరామ వినుర వేమ!

54. ఆ. చిత్తశుద్ధిగలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదువకాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకునెంత
విశ్వదాభిరామ వినుర వేమ!

55. ఆ. పెద్దవానిమిగులఁ జెఱచును దైవంబు
అడ్డుపడఁడు వానికాపదైన
పెద్దచేనుఁజూచి రెడ్డితామెచ్చునా
విశ్వదాభిరామ వినుర వేమ!

52. యథా కుంభస్థితో దీపః జలపూర్ణో ఘటో యథా।
నిర్వికార స్తథా ధీమాన్ శ్రూయతాం వేమ విశ్వద॥

53. అనుకార్యే కృతః క్వాపి సాధ్వృత్తమపి బాధతే।
ప్రతిజ్ఞా విషమే వ్యర్థా శ్రూయతాం వేమ విశ్వద॥

54. చిత్తశుద్ధ్యా కృతం పుణ్య మణ్వపి శ్లాఘ్యతాం వ్రజేత్।
న్యగ్రోధస్య కియద్బీజం శ్రూయతాం వేమ విశ్వద॥

55. విధిస్సాశయితా దుష్ట మాపద్యపి నరక్షతి।
నోషరం శ్లాఘతే స్వామీ శ్రూయతాం వేమ విశ్వద॥

56. ఆ. చెప్పులోనిరాయి చెవిలోని జోరీగ
కంటిలోనినలుసు కాలిముల్లు
నింటిలోనిపోరు నింతింతకాదయా
విశ్వదాభిరామ వినుర వేమ!

57. ఆ. చెఱకు తీపిలేమిఁ జెత్తనాఁబడునటు
పరగు గుణములేని పండితుండు
మాఱువడునుగాదె దోషమటుండఁగ
విశ్వదాభిరామ వినుర వేమ!

58. ఆ. చంపఁగూడదెట్టి శత్రువునైనను
జంపవలయు లోకశత్రుగణముఁ
దేలుకొండిఁగొట్టఁ దేలేమిచేయురా
విశ్వదాభిరామ వినుర వేమ!

59. ఆ. చంపఁదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేనిఁ గీడు సేయరాదు
పొసఁగమేలుచేసి పొమ్మనుటేచాలు
విశ్వదాభిరామ వినుర వేమ

౯౬. పాదుకాభ్యాం శ్రుతౌ వంశః పూజితః పాదేఽక్ష్ణి చేజ్జుణః।
మర్మఘాతీ గృహే పీడా శ్రూయతాం వేమ విశ్వద॥

౯౭. అమాధుర్యాద్వృథా కాష్ఠతుల్య ఇక్షుర్భవేత్తథా।
గుణహీనో జనో నింద్యః శ్రూయతాం వేమ విశ్వద॥

౯౮. న హన్యాత్ప్రాణినం కంచిత్ హన్యాల్లోకభయంకరమ్।
ఛింద్యాద్ వృశ్చికపుచ్చాగ్రం శ్రూయతాం వేమ విశ్వద॥

౯౯. శత్రుమాత్మవశం యాతం హన్తవ్యమపి సంత్యజేత్।
ఉపకృత్యా తు తం హన్యాత్ శ్రూయతాం వేమ విశ్వద॥

60. ఆ. చంపఁదలఁచురాజు చనువగ్గలంబిచ్చు
చెఱుపనున్నపగఱ చెలిమిసేయుఁ
గఱవనున్నపాము నెఱిగాఁచుకొనియుండు
విశ్వదాభిరామ వినుర వేమ!

61. ఆ. చమురుచాచికొన్నఁ జర్మంబు మెఱుఁగెక్కు
సాము చేయ మేను సత్తువెక్కు
జ్ఞానమార్గమెఱుఁగఁ గడతేరు జన్మంబు
విశ్వదాభిరామ వినుర వేమ!

62. ఆ. ఛత్రమున్నఁ దగిన ఛాయయేర్పడియుండు
శాస్త్రమెఱుఁగఁదగిన జ్ఞానమొదవు
నబ్బియున్నవాని కండయున్నట్టులే
విశ్వదాభిరామ వినుర వేమ!

63. ఆ. ఛురికతోడఁ గోయఁ జొప్పడునేకాని
దానిపిడినిఁగోయఁ దరమె నీకుఁ
దెలివిలేనిమేని బలమేమిచేయును
విశ్వదాభిరామ వినుర వేమ!

60. జిఘాంసన్ కురుతే రాజా మానుషం ప్రణయాస్పదమ్
స్వాంగూహత్పురగోదంష్ట్రిజా శ్రూయతాం వేమ విశ్వద॥

61. తైలాక్తం రాజతే చర్మ వ్యాయామీ బలమశ్నుతే।
ఉత్కర్షం జ్ఞానతో యాతి శ్రూయతాం వేమ విశ్వద॥

62. ఛత్రాచ్ఛాయాం యథోపైతి సాలంబో౽స్తిగువోర్యథా।
జ్ఞానీ నర స్తథా శాస్త్రాత్ శ్రూయతాం వేమ విశ్వద॥

63. అసినైవ భవేచ్ఛేదః కథం తన్ముష్టినా పునః।
అబుద్ధేః కిం బలాత్తన్వాః శ్రూయతాం వేమ విశ్వద॥

64. ఆ. ప్రాణిహింసఁజేసి పాపిష్ఠదేహంబు
నెవ్వఁడెప్డుఁబెంచ నెంచుచుండు
సత్కఁడు వానినెంచఁడాత్మసమంబుగ
విశ్వదాభిరామ వినుర వేమ!

65. ఆ. ఘుషము నీరువెడలఁ జచ్చుచేసిద్ధంబు
నీపనుండెనేని నిక్కపడును
అందతొలఁగునెడల నందఱిపనియస్లై
విశ్వదాభిరామ వినుర వేమ!

66. ఆ. ఉక్కడులనుగూడి యెక్కసక్కెములాడ
నిక్కమైనఘనుని నీతి చెడును
ఉల్లితోటఁబెరుగు మల్లెమొక్కకరణి
విశ్వదాభిరామ వినుర వేమ!

67. ఆ పరులమోసమెఱిఁగి ప్రాజ్ఞుఁడై యెవ్వండు
మోసపోఁడువాఁడె భూనుతుండు
ఆత్మతత్వమెఱుఁగ నగునుగాజ్ఞానికి
విశ్వదాభిరామ వినుర వేమ!

64. స్వకుక్షేః పూరణే వ్యగ్రాః యే జనాః ప్రాణిభిః స్థితైః।
ఆత్మవత్తాన్ స తే విద్యుః శ్రూయతాం వేమ విశ్వద॥

65 జలాద్బహి ర్గృతో మీనః ప్రగల్భస్తు తదంతికే।
స్థానభ్రష్టో భవే దేవం శ్రూయతాం వేమ విశ్వద॥

66. మాయినా సహసంవాసాత్ యాత్యార్యో నీచతాం ధ్రువమ్॥
పలాండునా యథా కున్దః శ్రూయతాం వేమ విశ్వద॥

67. మాయావివంచనాత్ స్వం యః త్రాయతే స ప్రవర్ధతే।
జ్ఞానీ తత్వం విజానాతి శ్రూయతాం వేమ విశ్వద॥

68. ఆ. ముప్పుగలిగినంత దప్పఁజూచుటకంటె
ముందుచూపుకల్మి ముఖ్యమయ్య
తెలియదేని యడుగు తెలిసినవారిని
విశ్వదాభిరామ వినుర వేమ!

69. ఆ. తప్పులెన్నువారు తండోపతండము
లుర్విజనులకెల్ల నుండుఁదప్పు
తప్పులెన్నువారు తమతప్పు లెఱుఁగరు
విశ్వదాభిరామ వినుర వేమ!

70 ఆ. దశముకాని యొకప్డు దారిద్ర్యమేర్పడు
హీనకార్యములుసహించి చేయఁ
బరువు మాయునింతె ఫలమింత చిక్కదు
విశ్వదాభిరామ వినుర వేమ!

71. ఆ. నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు
తళుకుబెళుకురాలు తట్టెడేల
కొమరుఁడొకఁడు సాలు గుణవంతుఁడౌనేని
విశ్వదాభిరామ వినుర వేమ!

68 ప్రాప్తాపదః ప్రతీకారాత్ జ్యాయసీ ప్రేక్ష్యకారితా।
అజానన్ జానతో విద్ధి శ్రూయతాం వేమ విశ్వద॥

69. పరదోషానుభృతః సర్వే స్వయం దోషస్య భాజనమ్।
దోషం వక్తా న వేత్తి స్వం శ్రూయతాం వేమ విశ్వద॥

70. మహత్యపి దరిద్రత్వే నాకార్యం కర్తుమర్హతి।
అనార్యత్వం తతో నాన్యత్ శ్రూయతాం వేమ విశ్వద॥

71. వరమేకో మణిశ్శుద్ధః న కాచా గణనాతిగాః।
అలమేకో గుణీ పుత్రః శ్రూయతాం వేమ విశ్వద॥

72. ఆ. నీళ్ళలోన మొసలి నిగిడి యేనుఁగుఁబట్టు
బయల కుక్కచేత భంగపడును
స్థానబలిమికాని తనబల్మికాదయా
విశ్వదాభిరామ వినుర వేమ!

73. ఆ. చేరనన్నవాఁడు నెఱజాణ మహిలోన
చేర్తునన్నవాఁడు వార్తకాఁడు
ఊరకున్నవాఁడె యుత్తమోత్తముఁడయా
విశ్వదాభిరామ వినుర వేమ!

74. ఆ. పట్టివిడువరాదు పదిలక్షలకునైనఁ
బెట్టి చెప్పరాదు పేదకైన
వెట్టిగొలువరాదు విభుఁడెట్టిఘనుఁడైన
విశ్వదాభిరామ వినుర వేమ!

75. ఆ. పాల నీడిగింటఁ గ్రోలుచునుండిన
మనుజులెల్లఁజూచి మద్యమండ్రు
నిలువఁదగనిచోట నిలువ నిందలు వచ్చు
విశ్వదాభిరామ వినుర వేమ!

72. నక్రో జలే ద్విపం హన్తి హన్యతే తు బహిశ్శునా।
స్థానాద్బలం న తు స్వస్య శ్రూయతాం వేమ విశ్వద॥

73. అజ్ఞంమన్యో భవేద్విజ్ఞః విజ్ఞమానీ జడః పునః।
మౌనవానుత్తమః ఖ్యాతః శ్రూయతాం వేమ విశ్వద॥

74. నారబ్ధం లోభితోఽప్యుజ్ఝేత్ న దానం కీర్తయేత్కృతమ్।
అదాతారం న సేవేత శ్రూయతాం వేమ విశ్వద॥

75. శౌణ్డికస్య గృహే పీతం క్షీరమాహుః సురాం సమే।
అస్థానావస్థితేర్నిందా శ్రూయతాం వేమ విశ్వద॥

76. ఆ. పొట్టివాఁడు కీడు పొడలపురుగు కీడు
పట్టియాశకీడు వరదు కీడు
పొట్టిచేయికాలు పొసఁగుట కీడురా
విశ్వదాభిరామ వినర వేమ!

77. ఆ. ఫక్కఁ దెలిసిపలుక నొక్కవాక్యమె చాలు
పెక్కులేల వట్టిప్రేలుచేల
దిక్కుగలిగి మ్రొక్కనొక్కఁడు చాలఁడా
విశ్వదాభిరామ వినర వేమ!

78. ఆ. మర్మమెఱుఁగలేని మానసంబదియేల
స్వజనమునకుఁగావి సంపదేల
వ్యాధినెఱుఁగలేని వైద్యుండునేలరా
విశ్వదాభిరామ వినర వేమ!

79. ఆ. భూమినాదియనిన భూమి ఫక్కున నవ్వు
దానహీనుఁజూచి ధనము నవ్వు
కదనభీతుఁజూచి కాలుఁడు నవ్వును
విశ్వదాభిరామ వినర వేమ!

76. ప్రాపనః కటలస్సర్వః ఆశా స్పృష్ట్వా న నిందితా।
పాణిపాదం తథా స్పష్టం శ్రూయతాం వేమ విశ్వద॥

77. వాక్యమేకమలం సాధు బహుభిః కిం ప్రజల్పితైః।
పాత్రైకో దేవ పిపాలం శ్రూయతాం వేమ విశ్వద॥

78. కిమపోషజ్ఞమా బుద్ధ్వా ఘాత్యా వాస్వజనార్థయా।
వైద్యేనాప్యాధ్యభిజ్ఞేన శ్రూయతాం వేమ విశ్వద॥

79. భువం స్వీయాం వదన్తం భూః అదాతారంధనసంహానేత్।
తచ్ఛ రణాద్భృతం శ్రూయతాం వేమ విశ్వద॥

80. ఆ. మిరెపుగింజఁ జూడ మీఁద నల్లగనుండుఁ
గొఱికి చూడ లోనఁ జుఱుకుమనును
సజ్జనులగువారి సారమిట్లుండురా
విశ్వదాభిరామ వినుర వేమ!

81. ఆ. మేడిపండుఁ జూడ మేలిమైయుండును
పొట్టవిచ్చిచూడఁ బురుగులుండు
బెరుకువానిమదిని బింకమీలాగురా
విశ్వదాభిరామ వినుర వేమ!

82. ఆ. మైలకోకతోడ మాసినతలతోడ
నొడలిముఱికితోడ నుండెనేని
యధికకులజునైన నట్టిట్టు పిలుతురు
విశ్వదాభిరామ వినుర వేమ!

83. ఆ. మ్రుచ్చు గుడికిఁబోయి ముడి విప్పునేకాని
పొసఁగ స్వామిఁ జూడఁ బోఁడతండు
కుక్క యిల్లు సొచ్చి కుండలు వెతకదా
విశ్వదాభిరామ వినుర వేమ!

80. దష్టం యత్స్వదయే దాస్యం మరీచం మలినం మహాః
ఈదృగ్రీతిః సతాం లోకే శ్రూయతాం వేమ విశ్వద॥

81. ఔదుంబరం ఫలం రమ్యం కిం గర్భం పిపీలికమ్।
భీరోస్థైర్యం కథం చిత్తే శ్రూయతాం వేమ విశ్వద॥

82. అకృత్తకేశం చాస్నాతం పూతిం మలినవాససమ్।
విప్రమప్యన్యథా బ్రూయుః శ్రూయతాం వేమ విశ్వద॥

83. చోరో దేవకులే చౌర్యే సక్తచేతాః న పైపతే।
ఘాటాన్వేషీ గృహే హిశ్వా శ్రూయతాం వేమ విశ్వద॥

84. ఆ. గోపకులమునందు గోవిందుఁడుదయించి
ఘనుఁడనంచుఁ గీర్తిఁ గాంచలేదె
గుణము కల్మిగాని కులమేమి ముఖ్యంబు
విశ్వదాభిరామ వినుర వేమ!

85. ఆ. వ్యర్థభాషలుడుగు మాలంబునను నీచు
బొంకులాడువానిఁ బొగడఁబోకు
మెప్పుమన్నైన గురునినెదిరించి పలుకకు
విశ్వదాభిరామ వినుర వేమ!

86. ఆ. రాముఁడొకఁడు పుట్టి రవికులంబీడేర్చెఁ
గురుపతియును బుట్టి కులముఁ జెఱిచె
ఇల నధర్మధర్మముల రీతులిట్టివి
విశ్వదాభిరామ వినుర వేమ!

87. ఆ లంకపోవునాఁడు లంకాధిపతి రాజ్య
మంత కీశసేనలాక్రమించెఁ
జేటుకాలమైనఁ జెఱుప నల్పుఁడె చాలు
విశ్వదాభిరామ వినుర వేమ

84. గోపో యమునవే జాతః కృష్ణోఽప్యుదయవా న కిమ్।
గణో న త్వష్టమో గణ్యః శ్రూయతాం వేమ విశ్వద॥

85. నమతే న వృథా భాష్యం బాలిశీమో న బాసృతీ।
నుదర్న ప్రతిపున్నేయః శ్రూయతాం వేమ విశ్వద॥

86. రామేణ స్వకులం దీప్తం దగ్ధం తత్కౌరవేణ తు।
ఆర్యానార్యా జగత్యేవం శ్రూయతాం వేమ విశ్వద॥

87. వినంక్ష్యత్ రాక్షసం రాజ్యమాక్రాంతం కపిసైనికైః
క్షేష్యతోఽలం జయేఽల్పోఽపి శ్రూయతాం వేమవిశ్వద॥

88. ఆ. తెక్కలేనియాళ లీలమై యుండగాఁ
చిక్కమెత్తి నరుఁడు తిరుగఁగాక
కుక్కవంటిమనసు కూర్చుండనిచ్చునా
విశ్వదాభిరామ వినుర వేమ!

89. ఆ. లోభమోహములను బ్రాభవములుతప్పఁ
దలఁచినపనులెల్లఁ దప్పి చనును
దానొకటి దలఁచిన దైవమొండగుచుండు
విశ్వదాభిరామ వినుర వేమ!

90. ఆ. వంపుకఱ్ఱఁ గాచి వంపుఁ దీర్పగవచ్చుఁ
గొండలన్ని పిండిగొట్టవచ్చుఁ
గఠినచిత్తుమనసు కరగింపనగునొకో
విశ్వదాభిరామ వినుర వేమ!

91. ఆ విద్య కలిగియుండి వినయము లేకున్న
నైదువలకు మేలిమైనమణుల
సొమ్ములుండి కంఠసూత్రము లేనట్లు
విశ్వదాభిరామ వినుర వేమ!

88. అశాస్వగణస్యోయాసు పచరత్నోపళో సదః।
శ్వాతుల్యస్య కిమస్యత్స్యాత్ శ్రూయతాం వేమ విశ్వద॥

89. లోభమోహౌ వినిస్ద్వా హి సర్వం స్యాత్తద్వతో వృథా।
దైవం స్యాత్ప్రతికూలం చ శ్రూయతాం వేమ విశ్వద॥

90. వక్రదండం ఋజుం కుర్యాత్ పింష్యాత్సర్వగిరీనపి।
న ద్రావ్యం కఠినం చేతః శ్రూయతాం వేమ విశ్వద॥

91. విద్యా వినయహీనాచే న్నిస్సూత్రాయాః స్త్రియాః సమా।
సత్త్వేఽపి మణిభూషాణాం శ్రూయతాం వేమ విశ్వద॥

912\. ఆ విద్యలేనివాఁడు విద్వాంసులకడను
ఉండఁగానె పండితుండు గాఁడు
కొలనిహంసలకడఁ గొక్కెరలున్నట్లు
విశ్వదాభిరామ వినుర వేమ!

ఆ. కొంచెగాఁడు యాచకునివోలె దరిఁజేరి
కూలపేయుఁ బరుల గోతిలోనఁ
జెంతఁ జేరనీయఁ జేకూరు దోషంబు
విశ్వదాభిరామ వినుర వేమ!

వేఱుపురుగు చేరి వృక్షంబుఁ జెఱచును
జీడపురుగు చేరి చెఱచుఁ దీవఁ
గుత్సితుండు చేరి గుణవంతుఁ జెఱచును
విశ్వదాభిరామ వినుర వేమ!

వ్యాధి కలిగెనేని వైద్యునిచేతను
మందు దినకకాని మానదెందుఁ
కెంత దీపమిడక చీకటి పాయునా
విశ్వదాభిరామ వినుర వేమ!

92. అవిద్వాన్ విదుషాం పార్శ్వే స్థితోఽపి న హి పండితః।
బకో న హంసః తత్పార్శ్వే శ్రూయతాం వేమ విశ్వద॥

93. పిశునోఽర్థీవ సర్పస్సన్ గర్తేఽస్యం పాంసుమేద్విషమ్।
సర్వథా వర్జనీయోఽసౌ శ్రూయతాం వేమ విశ్వద॥

94. మహీరుహం యథా కీటో నాశయేచ్ఛ లతాం క్రిమిః।
తథైవ గుణినం దుష్టః శ్రూయతాం వేమ విశ్వద॥

95. ఔషధం భిషజా దత్తం వినా వ్యాధిర్న శామ్యతి।
దీపేనైవ తమోఽపైతి శ్రూయతాం వేమ విశ్వద॥

96. ఆ. జంతుతతులఁ దెచ్చి సమయించుచుందురు
శక్తికిందుఁ గల్గు శక్తి యనుచు
పసువులఁ జిసగఁగోరు పడతుక దైవమా
విశ్వదాభిరామ వినుర వేమ!

97. ఆ. చిప్పలోనఁ బడ్డచినుకు ముత్యంబయ్యె
నీటఁ బడ్డచినుకు నీళ్ళఁ గలసె
ప్రాప్తము గలచోట ఫలమేల తప్పురా
విశ్వదాభిరామ వినుర వేమ!

98. ఆ. సకలవిద్యలందు సంపన్నులైయున్న
నట్టివారు పరిచయమునఁ జౌక
పెరటిచెట్టుమంచు పరికింప మెచ్చరు
విశ్వదాభిరామ వినుర వేమ!

99. ఆ. చేటువేళఁ దనకు దీటులేఁడంచును
గర్వమందుఁగాదె సర్వజనుఁడు
దివ్వె యారువేళఁ దీరుగా వెలుగదా
విశ్వదాభిరామ వినుర వేమ!

96. శస్త్రేణాఘాతినే మూర్ఖాః ప్రాణిహింసాం వితన్వతే।
జంతుఘాతాత్ఫలం దైవం శ్రూయతాం వేమ విశ్వద॥

97. ముక్తాస్స్యాత్స్వాతితః శుక్తౌ జలబిందుః జలే జలమ్।
క్షేత్రాయత్తాః పదార్థా హి శ్రూయతాం వేమ విశ్వద॥

98. అవజ్ఞేయోహిసాన్నిధ్యాత్విద్యానాంపారగోఽపిసన్।
ఓషధిఃప్రాంగణస్థేవ శ్రూయతాం వేమ విశ్వద॥

99. ప్రగల్భమానో గర్వాన్ధః స్యాదాసన్నే క్షయే జనః।
నిర్వాస్యన్ హి చలో దీపః శ్రూయతాం వేమ విశ్వద॥

100. ఆ. హీనుఁడెన్ని విద్యలిల నభ్యసించిన
ఘనుఁడు గాఁడు హీనజనుఁడు గాని
పరిమళముల గర్ధభము మోయ ఘనమౌనె
విశ్వదాభిరామ వినుర వేమ!

101. ఆ. హింసఁ దక్కియుంట యెంతయు ధర్మంబు
జనులఁ దినఁగఁ గోరఁ బాపమౌను
దినఁగఁ గోరున చవిఁ దనదుసంతానంబు
విశ్వదాభిరామ వినుర వేమ!

102. ఆ. క్షమగల్గువాఁడు సాధుఁడు
క్షమకంటెను మేలుగుణము కానముధరలోఁ
క్షమ సన్మంగళములకును
క్షమయే స్థానంబు తెలియక్షముఁడగు వేమా!

—oOo—

100. సర్వా విద్యా అధీత్యాపి న దుష్టో యాతి పాత్రతామ్।
వహన్నివ ఖరః స్వర్ణం శ్రూయతాం వేమ విశ్వద॥

101. ఆ. అహింసా పరమోధర్మః నాత్తుంవధ్యా హి జన్తవః।
కిం జిఘాసత్యపత్యం స్వం శ్రూయతాం వేమ విశ్వద॥

102. ఆ. క్షమావానుచ్యతే సాధుః న క్షమాసదృశం భువి।
మంగళానాంక్షమాయోనిః శ్రూయతాం వేమ విశ్వద॥

—oOo—